Sree

# VISHNU DANDAKAMU

BY

G. SURYANARAYANA SASTRI,

*Telugu Pandit,*

Board Secondary School,

NARSIPATAM.

Published by the Author.

Price: 1 Anna.

PRINTED

AT THE S. S. M. PRESS,

శ్రీరస్తు.

# విష్ణుదండకము.

శ్రీమద్రమారామ గోవింద నారాయణా
భక్తకల్పద్రుమా సత్యభామామనశ్చోర ధీ
రా మహాశ్చర్య కోటిస్మరాకారలీలా మనుష్యా
వతారా మహామేరుధీరా సదాపాపదూరా స
దాచార స్వేచ్ఛావిహారా శుభాకార వీరాధివీ
రా హరీ పూర్వదేవారి దుర్వార పాథోధిగంభీ
ర దామోదరా దీనమందార ధీరా మురారీ
కృపాంభోనిధీ కావరా లోకచింతామణీ మా
నినీచింతామణీ చక్రపాణీ సురోద్దిష్ట జిష్ణూ మ
హల్లోకవర్ధిష్ణు విష్ణూ సమాలంకరిష్ణూ హరీ
ద్వారకావాస నాకేశ లోకేశ హే యీశ నా
యాశలన్ గోయుగా [illegible] మీకా [illegible]

భాసమానా ముకుందాదిదేవా యనంతాభి
ధానా మహాదేవ దేవా సదా నెమ్మదిన్నెన్ని నీ
కంటె దైవంబులు న్వేరులేరంచు నీపాదపద్మం
బుల న్భక్తితో గొల్చెదన్ సారసాక్షా హృషీ
కేశ కాపాడవా మత్స్యమై తొల్లి పాథోధి
లో జొచ్చి యాశంకరాకారు నాసోమకున్ద్రుంచి
వేదంబుల న్దెచ్చివే దేవతల్ రక్కసుల్ క
వ్వముల్ మంధరగ్రావము న్బాని నాగేంద్రునిం
ద్రాడుగా బట్టి చిల్కంగ బల్మొండిపై దండిపై
కూర్మమై క్రిందచన్జొచ్చి నీవీపుతో మందరా
గ్రావమున్ లోకముల్మెచ్చగా నెత్తవే యీ
శ హేమాక్షుఁ డుగ్రోత్రమున్ జాపగా జుట్టగా
ఘోణివై వానిఖండించి సర్వంసహాభారమున్తా
ల్పి లోకంబు గాపాడవా మున్ను కృష్ణా జగ
ద్ధేతుకారా నృసింహావతారుండవై భీకరాకార
ముం జూప బాలారికత్రుంచిదు ర్మారకారిముం
జేయ సాకారివై నీవు నాకేశ వజ్రిప్రతీకాశ

పౌన్యవాగ్రంబుల నుప్పసక్తంచనుం జేల్చి లో
కాంస్త్రం. బాపవే భక్తమందార ప్రహ్లాదముని
న్ప్రోపవే దేవ యిసుప్రింపు వర్తిల్లుటుం గోరి
యిందాప్రిస్తుఖా నాపానుండంచుజేసేంచి యా
చాన్యాగ్నమై దాత లెవ్వార లీ ధారుణీచక్రముం
దంచు. బ్రోన్నంచి ధాత్రీసురుల్ సెప్పగా యా
తుఫానేశ్యానుంకేరి యో చక్రవర్తి మహాపుణ్య
మూర్తి వదాన్యోత్తమా హాళశీసార్వభౌమా
మహారాజరాజా మహాపద్మమార్తాండ తేజోవి
రాజా యిదే యొంటివాడన్ ధరానాథ దీనుం
డ నో దీనమందార యన్నంతలో నావదా
న్యుండు సంతుష్టుడై నిండుచిత్తంబుతో నిండు
వాగ్దాన మీయంగ మూడడ్గులే గోత్రమున్
గోరి యింతింతవై యంత కొండంతవై నీవు
బ్రహ్మాండము న్నిండుగా నిండురూపంబు వ్యా
పింపగా జేయువే మెండుగా రెండుపాదంబులన్
సర్వసర్వంసహా కాశముల్గప్పి యో చక్రవర్తిను

హోరాజ యీయజ్ఞ కాధారమున్జూప వేయన్న
దా మస్తకం బొప్పుగాఁజూప బంధించి పాతా
ళమందుంచవే వాసుదేవా జగద్రక్షకా జమ
దగ్న్యాంశుడవై రాజులం దోర్లి యుద్యోగ్ర
మా ర్లొప్పుగా గెల్చి యాకశ్యపుం బిల్చి భూ
చక్రిము న్దానమింపారఁగా నీయవే శ్రీధరా
హైహయాధీశు వే బాహువుల్ ఖండనం బొ
ప్పుగా జేయవే నాకసోపానము ల్గట్టవే భాగ్య
వృందంబు జేరొందవే మాధవా సూర్యవం
శంబునన్బుట్టవే రామనామాభిధానుండవై రా
తిని న్నాతిగా జేయవే పక్షిరాజున్ కృపాసాగ
రంబందు దేలించి మోక్షంబు నాడీయవే చా
టుగానుండి బల్ వాటమౌ బాణము న్వింటసం
ధించి హా వేటుకే వాలిప్రాణంబుల న్గొంచు
సుగ్రీవు గిష్కింధకున్ రాజుగా జేసి వారాన్ని
ధిం గట్టి యోపుండరీకాక్ష బల్ దండివై కుంభ
కర్ణాదులన్ చెండి చెండాడవే రావణున్ శంకలే

ఖండదద్ప్రితకన్ లంకకుంబట్టముంగట్టవేరా
హ మార్తాండకోటిప్రభాభాసమానుండవై జా
నకింగూడి లోకంబులు న్మెచ్చ సాకేతమేలంగ
నేడే జగన్నాథ భూభారము న్మాన్పగా దేవకీ
దేవి గర్భంబున న్బుట్టి వ్రేపల్లెలోనుండి నం
దాదు లానంద మొప్పారగా బెద్దవై నేల
పై బ్రాకుచు న్మన్ను భక్షింప నాలోన నీ
తల్లి యన్నా యిదేమంచు నోర్విప్పగా జూ
పవా నీదు గర్భంబులో నేమసందర్భంబు లీరే
డులోకంబు లేడు ద్వీపంబుల న్గొండల న్గట్ట
ల న్మిట్టల న్బట్టల న్పట్టుల న్పిట్టల న్జెట్లులం బ
ల్లెలం బట్నముల్ జంతుజాలంబుల న్మేడల
న్వాడల న్గోడల న్జాడలన్ సొంపు పెంపార
నేపాళ నాటాంధ్ర కర్ణాట గాంధార బాహ్లీ
క కాశ్మీర కాంభోజ సౌవీర సౌరాష్ట్ర మ
హారాది ఛప్పన్న దేశంబులున్ వాని రారాజు
లున్ రాజులుం జక్రవర్తు ల్మహా సార్వభౌ

ము ల్మహానంద మొప్పారగా రాజ్యముల్ చే
సి కోటానకో ట్లర్బుదంబు ల్మహాపద్మ సం
ఖ్యాకులుం జచ్చుట ల్పుట్టుట ల్పొడ నాలో
న గోదావరీ తామ్రపర్ణి నదు ల్పారుట తీ
ర్థయాత్రాపరు ల్పుణ్యదేశంబుల జ్జేరుటల్
చూచుచుండంగ నాలోన స్వర్లోకమం దొ
ప్పుగా జూడ రం భోర్వశీ మేనకాదు ల్మ
హేంద్రాది బృందారకు ల్నిండుగా గొల్వదీ
ర్పంగ వేచేరి యింపారగా దోడిరాగంబునందా
నవర్ణంబుల న్పాడుచున్నంతలో నొక్కరుం
డొప్పుగా లేచి యో మేనకా ఫీలువారాగ
మింపారగా బాడుమూ యన్న నాలోన నాకీ
మణు ల్పాడగా మెచ్చి బల్ గద్దెపై నుండి
యింద్రుండు కాన్కిచ్చుట ల్వింతతో జూడ
గా నంతలో మాయచే గప్పి బల్మందహాసం
బున న్వింతగా గంతవా మాధవా ముద్దులంగూ
ర్చి గంధర్వుల న్బ్రోవవా నక్రమున్గూల్చి దం

తీశ్వరున్ గావవా శ్రీధరా గోపికాచిత్తచో
రా •రమానాథ రాజీవపత్రేక్షణా దీనబంధూ
కృపాళూ దయాసింధు రారా మదిన్గోపమేరా
యి దేన్యాయమారా మురారీశాగిపూర్వ దేవా
రిశౌరీ మహావైరిజీవాపహారీ పురాద్రౌపదిన్
కౌరవుల్ క్రూరులైపట్టి నిండోలగంబందుసందే
హమున్ లేక పుట్టంబులన్బట్టి యొల్వంగ బాం
చాలి కృష్ణా జగద్రక్షకా దీనరక్షామణీ భక్త
చింతామణీ దైవచూడామణీ ప్రోవరాయంచు
నిన్జీరగా జీరలీలేడె గోపాల గోవర్ధనోద్ధారణా
రంగధామా మహాశత్రుభీమా భళీ సార్వభౌ
మా కురుక్షేత్రవాసుల్ కరంబల్గి పోరాడుచే
[illegible]టియుండన్ నిరాబారులంగూడి వే రాయు
ధారంబు సల్పంగ నాలోన దుష్టుల్ దురాచా
రు లాకర్ణ దుశ్శాసనాదుల్మహాయంత్రము ల్బ
న్ని సన్నట్టయత్నింపగా విశ్వరూపంబు జూపిం
పగా నాంబికేయుండు నేత్రంబులన్గోరగానిచ్చి

దనం బొప్పుగా జేయుచున్ ద్రోణగాంగేయు
ల న్మొండిగా జేయ నాలోన భీముండు భీమాశ్చ
ర్యశ్చాని దారాజు జేబట్టి బంధించి యుగ్రంబు
గా నూర్వుభాగంబులన్గోర్కి దీరంగ భంగంబు
గావింపగా జూచి భీమా భళీయంచు మెచ్చన్
సురల్ పుష్పవర్షంబు వర్షింపగా నంతలో న
ప్సరల్ నాట్యముల్సల్పగా జేయవే ధర్మరాజు
న్మోదంబొప్పగా శ్రీధరా కృష్ణ భూభారమున్మా
న్పవా బ్రహ్మకున్బ్రహ్మవై గోవులన్వత్సలన్బా
లురన్ సృష్టికిన్మారుగా సృష్టినిన్జేసి మున్ బ్రో
వవా కృష్ణ బుద్ధావతారం బబద్ధంబు గాకుంత
కుద్దుండవై యుద్ధతేజుండవై శ్రీజగన్నాథనా
థుండవై మూడులోకంబులన్ బ్రోవవా యా
దదుద్ధారకా దేవదేవోత్తమా తామ్రపర్ణీనదీ
తీరమం దొప్పుగా కంబళగ్రామవాసుండవై
విష్ణుదేవాభిధానంబుచే నొప్పు భూదేవగర్భం
బునన్పుట్టవే కల్కివై ఖడ్గమున్ హస్తమందొ

ప్పుగా బట్టి దుర్మార్గుల న్బట్టి ఖండింపవా శిష్టు
లన్ బ్రోవవా జాతులన్ వృత్తులం. జక్క
నం జేయవా పూర్వమందందమా నందిని స్సంగి
రెద్దంచు బల్ పొందుగా దిద్ది యోయుంది రానా
థ యూబొమ్మ కంఠంబునన్వీరణంబుంచి యిం
ద్రాదులు న్వెన్క బాడంగ జేజేలు శ్లాఘంబు
లన్గొట్టగా నాయకుండంచు బేరొంది నాగాసు
రున్జైచి బల్ దండివై ముందుగా రెండుహస్తంబు
లన్ పొందుగా నిండుగా జూచి యానంద మొ
ల్కంగ సాష్టాంగముల్ చేయుచు న్మెండు
గా వెండి సన్నాయితో బాడుచున్ చిందు
లన్ ద్రొక్కుచున్ జేతులాడించుచున్నందినా
డించుచున్ సుందరాకారబల్మందహాసంబులన్
ముద్దులన్దెల్పి నీ వింద్రజాలుండవై శంకరున్గోరి
యాశాంకరిన్ బ్రోవవా కృష్ణమృద్భక్షణా దు
ష్టసంశిక్షణా శిష్టసంరక్షణానీకటాక్షంబునాపైని
పొంపారగా జూపవాయంచు నీపాదపద్మంబుల

న్గాల్చెదన్ బుద్ధిహీనుండ నోపద్మనాభా సదా
నెమ్మదిన్నన్నుధ్యానించి సాష్టాంగముల్ చేసె
దన్ దేవ! లోకంబులో దండ్రి దండింపడే బిడ్డ
లన్దప్పులన్జేయ నో యాదవాగ్రేసరా తప్పుల
న్దిద్ది రక్షింపరా దేవరారా దయన్ బ్రోవవేరా
కృపాసాగరా శ్రీహరీ సూర్యచంద్రాదులుం జు
క్కలున్ సంద్రముల్ గోత్రము ల్పంచభూతం
బు లీరేడులోకంబులు న్నీవకావే మహాదేవ
నీభక్తులన్ బ్రోచుటే చోద్యమా దేవ వా
టంబుగా జల్లపేటాగ్రహారంపువాసుండ నో
దానమందార గంట్యాన్వయాంభోధి పూర్ణేందు
వద్వెంకనార్యద్వితీయాత్మజుండై నశ్రీసూర్యనా
రాయణాఖ్యాతు డానందమొప్పారగా రాక్ష
సాబ్దంబులో నాశ్వినంబందు శుక్లాష్టమీ శుక్ర
వారంబునం జెప్పె నీదండకం బొప్పుగా నాత్మ
లో నన్యభావంబు లేకుండ ధీయుక్తులై వ్రా
సినం దిన్నగా నాలకింపన్ బఠింపంగ వారల్

భువి న్వృద్ధకాలంబు దీర్ఘాయురారోగ్యసంపత్సు
పుత్రాదుల న్పొందుటంగాక యంతంబున న్విష్ణు
సాన్నిధ్యముం న్పొందరే కృష్ణ గోపాల స్నిగ్ధగీత
లోలా నమస్తే నమస్తే నమః.

సంపూర్ణము.



